కమ్యూనిస్టులచే పోలెండ్ మాజీ ప్రధాని విడుదల

# ఆంధ్రపత్రిక

THE LITTLE LIFCO DICTIONARY (English-English-Telugu)

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 9 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 9-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా


# హైదరాబాదు భూసంస్కరణలనే ఆంధ్రలో వర్తింపజేయాలి

## ప్రభుత్వోద్యోగుల్లో పెద్ద కులాల తత్వం పోవాలి

### ప్రజలను మన్నించడం ప్రజాస్వామ్య పద్ధతి అని నెహ్రూ బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 7: ప్రభుత్వోద్యోగులు తామేదో పెద్ద కులాలకు చెందినట్లు భావించకూడదనీ, తమవద్దకు వచ్చేవారిని గౌరవించడం అనేది ప్రజాస్వామ్య పద్ధతిగా గ్రహించాలనీ ప్రధాని శ్రీ నెహ్రూ ప్రభుపాలనా సంస్థ ద్వితీయ సమావేశంలో ప్రసంగిస్తూ బోధించారు.

ప్రభుత్వోద్యోగుల ధర్మాలను నిర్వచించే 'సివిల్ సర్వీస్ రూల్స్' బూజుపట్టిపోయిందని చెప్తూ, దాన్ని తుడిచి పెట్టాలని శ్రీ నెహ్రూ అన్నారు. స్వతంత్ర దేశ పరిపాలనకు అనుకూలంగా ఉద్యోగ ధర్మాలను పునర్నిర్వచన చెయ్యాలన్నారు.

ప్రభుత్వోద్యోగులు ప్రజాసేవా తత్వాన్ని అలవరుచుకుంటేగాని వారి వృత్తి సార్థకం కాజాలదన్నారు.

## చట్టాల సమన్వయంలో తికమకలు ఉండవని శ్రీ నరసింగరావు సలహా

### 'ద్వంద్వభావం తలెత్తకుండా పరిపాలనా వ్యవస్థలో ఒకే ఆచరణ పద్ధతిని శీఘ్రంగా రూపొందించాలి'

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

కర్నూలు, ఏప్రిల్ 9: "భారతదేశం మొత్తంమీద హైదరాబాదు రాష్ట్రంలో ప్రవేశపెట్టిన భూసంస్కరణాలు ఆదర్శవంతమైనవని ప్లానింగ్ కమిషన్ ఒప్పుకున్నది. నూతనంగా ఏర్పడే ఆంధ్రరాష్ట్రం అంతటా అవే సంస్కరణాలను అమలుచేయడం వాంఛనీయం. ఈలోగా ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం తొందరపడి 'భూసంస్కరణాల పరిశీలక సంఘ సిఫార్సుల'ను పురస్కరించుకొని కొత్త శాసనాన్ని చేయవలసిన అవసరం లేదు" అని హైదరాబాదు భూసంస్కరణాల సంఘాధ్యక్షుడుగా పనిచేసిన శ్రీ మండుముల నరసింగరావు చెప్పారు.

ఇలాచేస్తే ముందు ముందు భూసంస్కరణాలను అమలుచేయడంలో, ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు ఎలాటి వైరుధ్యమూ తటస్థించదనీ, అవకతవకలు జరగడానికి అవకాశం లేకుండా శాసనాలు సాఫీగా అమలు జరుగుతాయనీ చెప్పుతూ శ్రీ నరసింగరావు ఇలా అన్నారు: ఇంతవరకూ హైదరాబాదు రాష్ట్రంలో ఔరంగాబాదు, గుల్బర్గా, ఖమ్మం జిల్లాలలో ములుగు తాలూకా (వరంగల్లు జిల్లా)లోనూ కమతాల పరిమాణాలను నిర్ణయించి అమలు జరుపుతున్నారు. ఒక క్రమంలో సంస్కరణ జరుగుతున్నది. ఆంధ్ర ప్రాంతంలో కూడా ఇదే విధంగా ఒక క్రమంలో అమలు జరిగి, కొత్త రాష్ట్రంలో భూసంస్కరణ కార్యక్రమం ఏ గందరగోళం లేకుండా జరుగుతుంది. రెండు ప్రాంతాల శాసనాలనూ సమన్వయం చేయడానికి జరిపే ప్రయత్నంలో ఇట్లా ఒక చిక్కు తేలికగా పరిష్కారమవుతుంది."

శ్రీ నరసింగరావు ఈ సమస్యపైన అడిగిన ప్రశ్నలకు చెప్పిన సమాధానాల సారాంశం: ప్రస్తుతం ఉన్న వ్యవస్థలో, కుటుంబ కమతం అంటే సాలుసరి ఆదాయము రూ 1600 గా నిర్ణయించాము. భూసారం, వ్యవసాయపద్ధతులు, ఫలసాయం ఆధారం చేసుకొని ఈ పరిమితు...

...కోవాలన్నా, కుటుంబ పరిమితికి 3 రెట్లకంటే ఎక్కువ ఉంచుకోరాదు.

ఉదాహరణకు–నిజాంబాదు జిల్లాలో నీటివసతులున్నాయి. రెండుపంటలు పండుతాయి. వరి, చెరకు బాగా పండుతాయి...

...బాదు జిల్లాల్లో, వారు సాగుచేస్తున్న భూములను వారి స్వాధీనానికే సవంబరు దర నుంచీ తెచ్చారు.

కొత్త రాష్ట్రంలో రెవెన్యూబోర్డు ఒకే సంస్థగా పని చేయాలి. హైదరాబాదు సభ్యులకు భూసంస్కరణల చట్టం అమలుచేసే బాధ్యత అప్పగించవచ్చును. క్రమంగా వివిధ నిబంధనలను, ఈ తీర్పులను, సంప్రదాయాలను ఏకీకృతం చేయడానికి కృషి చేయవచ్చు. ఇలాగే హైకోర్టు, సర్వీస్ కమిషన్ కూడా లీనమై పనిచేయడం శ్రేయస్కరం.

## గోవాపై భారత దేశం హక్కు

### తూర్పు జర్మనీ ప్రధాని సమర్థన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 7: గోవా, ఇతర పోర్చుగీసు పాలిత భారత ప్రాంతాలపై పూర్తి హక్కు భారతదేశానిదే అని తూర్పు జర్మనీ ప్రధాని శ్రీ ఒటో గ్రోటెవాల్ ఇటీవల బెర్లిన్‌లో ప్రసంగిస్తూ సమర్థించారు.

ప్రధాని శ్రీ గ్రోటెవాల్ పంచశీల సూత్రాలను ఆమోదిస్తున్నట్టు కూడా ప్రకటించారు.

తూర్పు ఇరియన్ (న్యూగినీ) పై ఇండొనీషియా హక్కును కూడా సమర్థిస్తూ, వలసపాలకులు ఆక్రమించుకున్న ఈ ప్రాంతాన్ని, యుద్ధాలు రెచ్చగొట్టడానికి కేంద్రంగా వినియోగిస్తున్నారని శ్రీ గ్రోటెవాల్ ఆరోపించారు.

## విషమ ఫలితాలు ఉంటాయి

### భారతదేశానికి పోర్చుగీస్ హెచ్చరిక

## పాక్ ప్రధానితో చర్చకు శ్రీ నెహ్రూ సుముఖం

### పరిస్థితి నిరుత్సాహంగా లేదని గజన్‌ఫరాలీఖాన్ వెల్లడి

కలకత్తా, ఏప్రిల్ 7: భారత ప్రధాని శ్రీ నెహ్రూ, పాకిస్తాన్ ప్రధానితో ప్రత్యక్షంగా చర్చలు జరపాలనే ఆసక్తి ప్రకటించారని భారతదేశంలో పాకిస్తాన్ హైకమీషనర్ రాజా గజన్‌ఫర్ ఆలీఖాన్ తెలియజేశారు.

భారత పాకిస్తాన్ దేశాల ప్రధాన అంశాల పరిష్కారానికి యీ చర్చలు ఉపకరిస్తాయని, శ్రీ నెహ్రూ నిన్న సాయంత్రం ఢిల్లీలో తనతో సంభాషిస్తూ తెలియజేశారని కూడా అన్నారు.

భారత ప్రధానితో తమ సంభాషణలు "ఎంత మాత్రం నిరుత్సాహంగా లేవు" అని రాజా గజన్‌ఫర్ ఆలీఖాన్ వెల్లడించారు. తమ చర్చల్లో వివిధ విషయాలూ వచ్చాయనీ, కాశ్మీర్ సమస్య, తూర్పు పాకిస్తాన్ నుంచి అల్పసంఖ్యాక వర్గాల వారు వలసపోవడం...

...పరిష్కరించటానికి ఉద్దేశించిన సమావేశాన్ని భారత ప్రధాని ఎప్పుడూ కాదన లేరు. ఉభయ ప్రధానుల మధ్య జరిగే యీ సమావేశ వివరాలు గానీ, తేదీ నిర్ణయం గానీ చర్చించ లేదు.

## భారతదేశం అంటే భయం

### పాకిస్తాన్‌కు

## బాహ్రేన్ దీవిపై బ్రిటన్‌కు హక్కు లేదు

### సామరస్యంతో తీసుకోవాలని ఇరాన్ ప్రయత్నం

టెహరాన్, ఏప్రిల్ 7: పెట్రోల్ సమృద్ధిగా దొరికే బాహ్రేన్ దీవిపై హక్కు పూర్తిగా ఇరాన్‌దే అని ఇరాన్ విదేశ మంత్రి డా॥ ఆలీ అర్దలాన్ ప్రకటించారు.

## ఆసియాపట్ల అమెరికా విధానం మారుతోంది

### త్వరలో కనపడతాయని కార్మిక నాయకుని అభిప్రాయం

కలకత్తా, ఏప్రిల్ 7: ఆసియాపట్ల అమెరికా వైఖరి మారుతుందనీ, అది త్వరలోనే స్పష్టంగా కనపడుతుందనీ అమెరికా కార్మిక నాయకుడు శ్రీ వ్యాల్టర్ రూథర్ ...

## హేవర్‌సెట్ ఆదేశం

## గోవాకు వెళ్లే విమానాలపై నిషేధం

### భారతదేశంమీదుగా పోరాదు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 7: గోవా మొదలైన పోర్చుగీసు పరిపాలిత ప్రాంతాల పరిసరాలకు వంద మైళ్ళలో, భారత దేశంమీదుగా విమానాలు పోరాదని నిషేధిస్తూ భారత ప్రభుత్వం ఆజ్ఞ ఇచ్చింది.

## మహిళల పాదుకు ఉద్యమం

## అర్జెంటీనాలో మరో కుట్ర వెల్లడి

## దేశంలో మూనెగముల ఆక్షేపణ

### పార్లమెంటు కాంగ్రెసు పక్ష చర్చ

## మరో కులతత్వం

## చూడవచ్చేవారిని చూడండి

## నేర్చుకోండి

ఆంధ్ర ప్రభుత్వము
విద్యా, ధర్మాదాయముల శాఖ
ఉత్తరువు

G. O. M.S. No 446/1-8-56.

1951 మదరాసు హిందూ మత, ధర్మాదాయ సంస్థలచట్టము యొక్క వరతులు, సదరు చట్టము క్రింద చేసిన నిబంధనలు తూర్పుగోదావరి జిల్లా, పెద్దాపురం తాలూకా జగ్గంపేట గ్రామములో ఉన్న "జగ్గంపేట సత్రము" అని వ్యవహరింపబడు ధర్మాదాయ సంస్థకు వర్తింపజేయదలచినట్లు మద్రాసు హిందూమత ధర్మాదాయ సంస్థల చట్టముయొక్క 3-వ సెక్షన్ 1 వ సబ్ సెక్షన్ షరతుల క్రింద ప్రభుత్వము వారు 18-6-55 తేదీగల G. O Ms. No. 898 విద్యా, ధర్మాదాయముల శాఖ ఉత్తరువులో ఒక ప్రకటన చేశారు. అట్లు పైన పేర్కొన్న చట్టము, దాని క్రింద చేసిన నిబంధనలను సదరు ధర్మాదాయ సంస్థకు వర్తింపచేయు విషయములలో సదరు ధర్మాదాయ సంస్థకు సంబంధించిన వారికే మైనను అభ్యంతరము న్నచో, పై నిబంధనలు ఎందు వర్తింపచేయరాదో కారణములు తెలియజేయుమని కోరారు. పై చట్టము వర్తింపచేయు ప్రతిపాదనకు ఎట్టి అభ్యంతరములు రాలేదు. పై ధర్మాదాయ సంస్థ ట్రస్టీచే సక్రమంగా నిర్వహింపబడుటములేదని ప్రభుత్వమువారు సంతృప్తి చెంది, ధర్మాదాయసంస్థ శ్రేయస్సు దృష్ట్యా, 1951 హిందూమత, ధర్మాదాయ సంస్థల చట్టముయొక్క అన్ని షరతులు, దానిక్రిందచేసిన నిబంధనలు, సదరు ధర్మాదాయసంస్థకు వర్తింపచేయటం అవసరమని భావించారు. తదనుసారముగా 1951 హిందూమత, ధర్మాదాయ సంస్థల చట్టముయొక్క అన్ని షరతులు, దానిక్రింద చేసిన అన్ని నిబంధనలు ధర్మాదాయ సంస్థకు వర్తింపజేయవలెనని ఆజ్ఞాపించుచున్నారు.

ఈ ఉత్తరువును జతచేసిన ప్రకటన ఆంధ్ర గెజెటులో ప్రకటింపబడును.

(గవర్నరు ఉత్తరువుతో)
కే. ఛాంబరిలేన్
ప్రభుత్వ ఉపకార్యదర్శి

## నోటిఫికేషను

1951 మదరాసు హిందూమత, ధర్మాదాయసంస్థలచట్టము (మదరాసు చట్టము XIX, 1951) సెక్షన్ 3 (1) క్రింద లభించిన అధికారములను పురస్కరించుకుని ఆంధ్ర గవర్నరు గారు పైన చెప్పబడిన చట్టముయొక్క అన్ని షరతులు, ఆ చట్టము క్రింద చేసిన అన్ని నిబంధనలు తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం తాలూకా జగ్గంపేట గ్రామములోని "జగ్గంపేట సత్రము" అని వ్యవహరింపబడు ధర్మాదాయ సంస్థకు వర్తింపజేయవలెనని ఇందుమూలంగా ఆదేశిస్తున్నారు.

## బుడమేటి పథకం

### మంత్రివర్గ సమావేశం

కర్నూలు, ఏప్రిల్ 8: ఆంధ్రమంత్రివర్గం బుడమేరు రిజర్వాయరును గూర్చి రేపు ఉదయం 10½ గంటలకు సమావేశమై పరిశీలనచేస్తారు. కేంద్ర జల విద్యుత్ శాఖసభ్యుడు డా॥ కె.ఎల్. రావు ఈ సందర్భంలో కర్నూలు రాగలరని ఆశిస్తున్నారు. ఆంధ్ర అడిషనల్ చీఫ్ ఇంజనీరు శ్రీ డి. ఎ. నరసింగరావు ఇవాళ బెజవాడనుంచి ఇక్కడకు వచ్చారు. స్పెషల్ చీఫ్ ఇంజనీరు ఎల్. వెంకటకృష్ణ అయ్యరుగారితో వారు ప్రాథమిక సంప్రదింపులు జరిపారు. రిజర్వాయరు పథకాన్ని విరమించరాదని కృష్ణాగోదావరి జిల్లాలలో బయలుదేరిన ఆపూర్వ ఆందోళనను మంత్రివర్గం వారు గమనిస్తారని ఆశింపబడుతోంది.

## ఉద్యోగవార్తలు

తూ॥ గో॥ జిల్లా పోలీసు సూపరింటెండెంటు వై. సత్యనారాయణ చౌదరికి డి. వై. ఎస్. పి. గా తగ్గించాక రెండు మాసాలు సెలవు మంజూరు చేశారు.

మే రెండవ తేదీనుంచి ఉద్యోగం నుంచి విరమిస్తున్న శ్రీ పి. వి. నరసింహం స్థానే శ్రీ వి. వెంకటరత్నం గోకల్ ఫండు అకౌంటెన్టు ఎక్జామినరుగా నియమితులైనారు.

తెనాలి సబ్ కోర్టులో
O P 96/55

పిటీషనరు:- వేములపల్లి కోటేశ్వరరావు మైనర్ గారి మొదలు రాముకోటయ్య.
రెస్పాండెంట్లు:- 1. వేములపల్లి సుబ్బయ్య - 2. యా రాఘవమ్మ - వెంకటాపురం, బళ్లారి జిల్లా 3. దాసరి నాగయ్య తరఫ్ నాగేశ్వరరావు, సా॥ తోటపాలెం, 15 మండవ శ్రీమయ్య, సా॥ గోవాడ. పిటీషనరు తరపు నోటీసు:- ...

ఆంధ్ర ప్రభుత్వము
విద్యా, ధర్మాదాయములశాఖ
ఉత్తరువు

G O Ms 667/ 28-8-55

## గ్రంథాలయాల చట్టం బాగ అమలు చేయాలి

### ప్రముఖ పండితులకు ప్రోత్సాహం ఉండాలని విజ్ఞప్తి

పామర్రు, ఏప్రిల్ 7: గ్రంథాలయాలకోసం స్థానిక సంస్థలు విధిస్తున్న పన్నును సక్రమంగా వసూలు చేయించాలని, వీటి అజమాయిషీ నిర్వహణకు ప్రత్యేకంగా ఉద్యోగులను నియమించాలని 17 వ ఆంధ్ర గ్రంథాలయ సేవకుల మహాసభలో అధ్యక్షుడు శ్రీ శరణు రామస్వామి చౌదరి విజ్ఞప్తి చేశారు.

దేశంలో ఎందరో మహాపండితులు ఉండగా వారి గ్రంథాలను కొని గ్రంథాలయాలలో ఉంచే ఏర్పాటు చేయక పోవడం, వారికి ప్రోత్సాహం ఇవ్వకపోవడం విచారకరమని, కేంద్ర ప్రభుత్వంలాగానే రాష్ట్ర ప్రభుత్వాలు కూడా సంస్కృతి వృద్ధికి ప్రోత్సాహం ఇవ్వాలనీ కోరారు.

శ్రీ రామస్వామి ఇలా అన్నారు: "గ్రంథాలయ శాసనాలు కావాలని సుమారు 30 సంవత్సరాలనుంచీ గ్రంథాలయ సేవకులు ఆందోళన చేస్తున్నారు. వీరిలో ముఖ్యులు దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారు. వీరు 1920 కి పూర్వమే మద్రాసు శాసనసభలో ఈ విషయమై వాదించారు. అప్పటి విదేశీ ప్రభుత్వం వీరి వాదనను విన లేదు. అప్పటికే బరోడా సంస్థానంలో చట్టం చేశారు. గ్రంథాలయోద్యమం ఆ ప్రాంతంలో వ్యాపించింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మద్రాసు రాష్ట్రంలో 1950 లో గ్రంథాలయ చట్టం చేశారు. అయితే యీ చట్ట ప్రకారం మనం పన్ను వేసుకోవలసి వచ్చింది. మొదట గ్రంథాలయ సేవకులు దీనికి వ్యతిరేకం తెల్పారు. కాని స్వతంత్రం వచ్చిన తరువాత పన్నులు తప్పవని అనుకున్నారు. ఈ చట్టం ద్వారా స్థానిక సంస్థలు యింటి పన్ను మీద రూపాయకు అర్ధణా వసూలు చేయాలి. ఏ జిల్లాలో యెంత వసూలైతే దానికి సమానమైన మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వం విరాళంగా ఇస్తుంది. ఈ నిధి ద్వారా నే గ్రంథాలయ వ్యవస్థలు పని చేస్తున్నాయి."

"గ్రంథాలయ సేవకులు, నిర్వాహకులు కొన్ని సవరణలు ఈ చట్టంలో చేయాలని సూచించారు. ఈ శాఖకు ప్రత్యేకంగా డైరెక్టరును ఏర్పరచక విద్యాశాఖా డైరెక్టరే యీ పని కూడా చూడమన్నారు. వారికి విద్యాశాఖా వ్యవహారాలే నిర్వహించడానికి వీలు లేక పోతున్నది. గ్రంథాలయాల పని చూసే తీరిక లేక పోతున్నది. దీనికి ఉదాహరణ: తెనాలి పురపాలక సంఘపు గ్రంథాలయం తీసుకోడానికి జిల్లా గ్రంథాలయసంస్థ అంగీకరించి సుమారు సంవత్సరం క్రిందట ప్రభుత్వానికి పంపితే యింతవరకూ అమీ తుమీ లేదు. ఇలాంటివి రాష్ట్రంలో యెన్ని ఉన్నాయో. జిల్లా గ్రంథాలయసంస్థ ...

... హించే గ్రంథాలయాలకు రూ 75, పంచాయితీ గ్రంథాలయాలకు రూ 33, మాత్రం ఇవ్వడం విచారకరం. ఒక్కొకదానికి కనీసం రూ 500, అయినా యిచ్చే ఏర్పాటు చేయాలని కోరుతున్నాము."

"మనదేశంలో శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, తుమ్మల సీతారామమూర్తి, నృత్యం జాషువా, వేటూరి వెంకటనరసయ్య, రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, స్వామి శివశంకరులు, కాటూరి వెంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతం, నండూరి సుబ్బారావు, గడియారం వేంకటశాస్త్రి మొదలగు కవిచంద్రులు ఎందరో మధురమైన కావ్యాలను రచించారు. ఇలాంటి కవితల్లజులను ప్రోత్సాహపరచి ఇంకా చక్కని కావ్యములను రచించడానికి ఆంధ్ర ప్రభుత్వం సహాయం చేయాలి."

"భారత ప్రభుత్వం అన్ని భాషలలోని మంచి గ్రంథాలకు బహుమతులిచ్చే ఏర్పాటు చేయడం ముదావహం. ఇప్పటికి చరిత్ర, సాహిత్య విమర్శ, పద్యరచన, జీవిత చరిత్ర, నవల, మనశ్శాస్త్రము, భాషా పరిశోధనము, శరీర శాస్త్రము, నాటకము, వ్యవసాయము, ఆరోగ్య శాస్త్రము, బాలసాహిత్యము, విద్యుత్ శక్తి, రసాయన విజ్ఞానము, సంగీతము, వినియోగ తత్త్వ శాస్త్రము, ఖగోళ శాస్త్రము, గృహనిర్వహణ శాస్త్రము, మొదలయిన గ్రంథాలు వ్రాసిన వారికి ఒక్కొక్కరికి రు. 5000 బహుమతులు ఇచ్చి ప్రోత్సాహం ఇస్తున్నారు. రాష్ట్రప్రభుత్వం కూడా ఇలాగే ప్రోత్సాహం ఇస్తే అనేక గ్రంథాలు వెలువడుతాయి."

1930 నాటికి ఆంధ్ర భాషలో ముద్రిత గ్రంథాలు, 12,256. అముద్రిత గ్రంథాలు 1671 మాత్రమే. దీనిని కాశీభాధుని నాగేశ్వరరావు పంతులు గారు ప్రకటించారు. తదుపరి వెలువడిన ...

## ప్రణాళిక: మన విద్యుక్తధర్మం

## ఎన్నిక అయిన నాయకునికి అర్హమైన గౌరవాన్ని ఇవ్వడం ధర్మం

### హైదరాబాదులో వివిధభాషలవారిపట్ల ఔదార్యం చూపవలసి ఉంటుందని శ్రీ బూర్గుల హితవు

మద్రాసు, ఏప్రిల్ 8: "ఒకరిని నాయకుడుగా ఎన్నుకున్న తర్వాత వారికి అర్హమైన గౌరవాన్ని ఇవ్వడం ప్రజాస్వామికమైన ధర్మం. వారిని దిగలాగడానికి ప్రయత్నాలు చేయడం, దుష్ప్రచారం చేయడం కూడదు. అలాంటి ప్రయత్నాలను సాగనిస్తే, వాటికి అంతం ఉండదు. ప్రతిపక్ష సభ్యులుకూడా, ఇదేధర్మం అనుసరించాలి. కొంతవరకు అనుసరిస్తున్నారు. ఆంధ్ర రాష్ట్రంలో ఇలాంటి ఆచారాన్ని అనుసరించడం అవసరం" అని హైదరాబాదు ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణరావు మా ప్రతినిధితో మాట్లాడుతూ అన్నారు.

"హైదరాబాదులో వివిధ భాషాప్రాంతాలవారు ఐకమత్యంతో గడుపుతున్నారు అక్కడ కాంగ్రెసు ఉద్యమ ప్రారంభకులలో మహారాష్ట్రులు కన్నడులు ఉన్నారు. వారంతా హైదరాబాదునగరవాసులే. వారు ఆంధ్ర పౌరు లవుతారు. వారిని ఆంధ్ర ప్రముఖులుగానే పరిగణించాలి. అలాగే ఉర్దూభాష, ఆంధ్రప్రాంతంలో ఇంగ్లీషు మాదిరిగానే, వ్యాప్తిలో ఉన్నది. దానినీ తెలుగుతో సమానంగా ఉదారబుద్ధితో మన్నించటం ధర్మం" అని కూడా చెప్పారు.

నూతన ఆంధ్రరాష్ట్రానికి (ఆంధ్ర ప్రదేశ్ కు) ఒకే హైకోర్టు, ఒకే పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఉండాలని చెప్పారూ హైదరాబాదులో పరిస్థితులను ఇలా వివరించారు: అక్కడి ఉద్యోగుల హోదాను ఇక్కడి ఉద్యోగుల హోదాను పరిశీలనం చేయడం కొంత ఆలోచించి చేయవలసిన పని ఎవ్వరి జీతాలూ తగ్గవు జీతాలు హెచ్చుగా ఉన్నా పదవుల హోదాలకు భంగం ఉండదు. ఉర్దూభాష మరి ఏదేని ఇతరైనా వాడకంలో ఉంచక తప్పదు. ఉర్దూ మాట్లాడేవారుకూడా తెలుగు నేర్చుకుంటున్నారు. ఈ మధ్య ఒక కలెక్టరు, కేవలం ఉర్దూ వచ్చిన వ్యక్తి తెలుగులో ఉపన్యాసం వ్రాసి చదివాడు. నాకు చాలా సంతోషం కలిగింది. ఇది మంచి కృషి. ఇట్లాగే రాబోయే ఆంధ్ర ప్రభుత్వమూ సహృదయంతో ఓపిక పట్టాలి."

"హైదరాబాదులో సిబ్బందికి అవసరమైన ఇళ్లు పూర్తిగా దొరకవు. కొన్ని ఇళ్లు కట్టించవలసి వుంటుంది. హైదరాబాదు ప్రభుత్వం కొన్ని పాత భవనాలను కొని మరమ్మతులు చేయిస్తున్నది. కాని సిబ్బంది ఇళ్ల విషయం ఒక సమస్య."

"ఒకరినొకరు సానుభూతితో అర్థం చేసుకొని పనిచేస్తే అన్ని సమస్యలూ పరిష్కార మవుతాయి."

## ఆల్ప్స్ మార్గదర్శకుని మృతి

### మంచుకు దేహం గడ్డకట్టుకు పోయి

చామోన్ (ఫ్రెంచి ఆల్ప్స్), ఏప్రిల్ 8: ఫ్రాంసులో ఆల్ప్స్ పర్వతాలను ఎక్కేవారికి మార్గదర్శకుడుగా ప్రఖ్యాతి చెందిన పాల్ దిమార్కీ గురువారంనుంచీ కనపడడం లేదు. హఠాత్తుగా 16 వేల అడుగుల లోయ (దుముడి)లో అతని దేహం కనపడింది. అతనితో వెళ్లిన ఒక స్కీయింగ్ శిక్షకుడు, అతని శిష్యుడూ ఇంకా కనపడలేదు

దుర్ఘటన కనుగొనడానికి వీరు ముగ్గురూ గురువారం నాడు వెళ్లారు. దిమార్కీ దేహం గడ్డకట్టుకు పోయింది. మిగతా వారికోసం వెదుకుతున్నారు.

## ప్రతిజిల్లా కేంద్రంలో క్షయచికిత్సాలయాలు

### కర్నూలు, విశాఖ, మంగళగిరిలలో ఆసుపత్రులు

కర్నూలు, ఏప్రిల్ 8: ద్వితీయ ప్రణాళికాకాలంలో రాష్ట్రంలో ప్రతిజిల్లా ప్రధాన కేంద్రంలోను క్షయచికిత్సా కేంద్రాలు, కర్నూలు, విశాఖ, మంగళగిరిలలో క్షయవ్యాధి ఆస్పత్రులను రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేయగలదని వైద్యశాఖ డైరెక్టరు శ్రీ కె. ఎస్. రావ్ నిన్న ఆంధ్ర క్షయవ్యాధి నిరోధసంఘ ప్రథమ వార్షిక సమావేశానికి అధ్యక్షత వహిస్తూ తెలియజేశారు.

వచ్చే కొద్ది సంవత్సరాలలోను రాష్ట్రమంతటా బి. సి. జి. ఉద్యమం విస్తరించగలదని చెప్పారు. జిల్లా ప్రధాన కేంద్రాలతోపాటు, లక్ష జనాభా దాటిన బెజవాడ, రాజమండ్రి, తిరుపతివంటి పట్టణాలలో కూడా క్షయచికిత్సా కేంద్రాలు నెలకొల్పాలని ఆలోచిస్తున్నట్లు వెల్లడించారు. ఇంకా యిలా వివరించారు.

"ప్రధాన జిల్లా కేంద్రాలలో వున్న 7 క్షయ చికిత్సా కేంద్రాల స్థాయిని ...

## సంపాదకునకు లేఖలు

### రిజిస్ట్రేషన్ సౌకర్యం

అయ్యా! మా గ్రామము కొత్తపేట సబ్ తాలూకాలో చేరివున్నది. చాలా కాలం నుంచి కొత్తపేటలోనే మా ...

## భారతీయ ఆంగ్లుల బహిష్కరణ

### లుసాకా నిగ్రోలచే

## సైప్రస్ జాతీయ వాదులపై క్రౌర్యం

## జీతాలు రాని ఉపాధ్యాయులు

## పూల్ రాణి

## మాంగనీస్ రవాణాకు రైలుపెట్టెల కొరత

### 15 వేలమంది కార్మికుల వృత్తికి బెడద: నౌకలకు నష్టం

విశాఖపట్నం, ఏప్రిల్ 8 : గరివిడి, పరిసర మాంగనీసు గనులలో పనిచేసే 15 వేలమంది కార్మికులకు జీవనోపాధి పోయే ప్రమాదం ఏర్పడింది; లక్షటన్నుల ఖనిజం ఎగుమతి అవకాశాలు లేక నిలిచిపోయింది.

దీనికంతకూ కారణం చాలినన్ని రైలుపెట్టెలు సరఫరా కాకపోవడమే. దీనిమూలంగా కలుగుతున్న యింకో పెద్దనష్టం మన నౌకలకు. ఇది యీ ఖనిజాన్ని విదేశాలకు చేరవేస్తూ వుంటాయి. ఇప్పుడు రైలుపెట్టెల సరఫరా లేక పోయేసరికి నౌకలకుకూడా ఖనిజం అందించే వీలులేక, నౌకలకు రవాణా ఛార్జీలు లభించే అవకాశం కూడా పోతోంది.

నెలకి సగటున 25 వేల టన్నుల ఖనిజం ఎగుమతి అవుతోంది. మధ్యప్రదేశ్‌లో రైల్వే అధికారులు రైలుపెట్టెల సప్లయిని రోజుకు 100 నుంచి 150 వరకు హెచ్చించారు. కాని యిక్కడ 30 నుంచి 25 కి తగ్గించారు! ఖనిజం వుత్పత్తి సరఫరా అవకాశాలు యిక్కడ ఎక్కువవుతూంటే రైలుపెట్టెల వసతి తగ్గుతోంది!

ఆగ్నేయ రైల్వే అధికారులు వెంటనే జోక్యం చేసుకుని చర్యలు తీసుకోకపోతే ఈ పరిశ్రమ ఆంధ్రలో దెబ్బతింటుంది. (స్వ. వి.)

## ఆయుర్వేద వైద్యుల రిజిస్ట్రేషన్

### ప్రభుత్వానికి కృతజ్ఞత

ఏలూరు, ఏప్రిల్ 8: ఆయుర్వేద, యునానీ, వైద్యులందరిని రిజిస్టరు చేసే నిమిత్తం ప్రభుత్వం ఒకచట్టం తయారు చేయ దలచినందుకు పశ్చిమ గోదావరి జిల్లా ఆయుర్వేద మండలి వారు హర్షించారు. శ్రీ కళా వెంకటరావు కృషి వల్లనే ఆయుర్వేద వైద్యులకు మంచి రోజులు రానున్నవని, వైద్యులందరి తరఫున వారిని అభినందించారు. మార్చి 31 న అంబాజీపేట గ్రంథాలయములో పశ్చిమ గోదావరి ఆయుర్వేద మండలి సర్వసభ్య సమావేశం జరిగింది.

సభకు శ్రీ దల్లా నరసింహమూర్తి అధ్యక్షత వహించారు. ఆంధ్ర ఆయుర్వేద మండలి సంయుక్త కార్యదర్శి శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య ప్రారంభించారు. ఆయుర్వేద వైద్యులందరు తాలూకా జిల్లా మండలులు బలపరచు కోవాలని రిజిస్టరుకాని ఆయుర్వేద వైద్యుల ఫోటోలు సేకరించి రాష్ట్రమండలికి అందజేస్తూ ప్రభుత్వం నియమించే బోర్డుచే తొల్పరి రిజిస్ట్రేషనులో లోపాలు జరగకుండా చేయ దలచినదిగా శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య విజ్ఞప్తి చేశారు.

తరువాత అధ్యక్షులు శ్రీ దల్లా నరసింహమూర్తి జిల్లా మండలి ప్రధాన కార్యదర్శి శ్రీ పెద్దింటి వెంకటాచార్యులు, శ్రీ చందు సుబ్బారావు, శ్రీ మొగల్ ముస్తాఫా సాహెబు ప్రసంగించారు.

### సభలు-సమావేశాలు

శ్రీకాకుళం జిల్లా అభివృద్ధి మహాసభ యీనెల 21 న నరసన్నపేటలో జరుగుతుంది. శ్రీ యస్. జగన్నాథం అధ్యక్షత వహిస్తారు. ముఖ్యమంత్రి ప్రారంభిస్తారు.



## ఇనుప ఖనిజం

### వరంగల్లు ఖమ్మం జిల్లాల్లో

హైదరాబాద్, ఏప్రిల్ 6: మేలురకం ఇనుప ఖనిజాలు ఖమ్మంమెట్టు వరంగల్లు జిల్లాలలో చాలా ప్రాంతాలలో కనుపించాయని అధికార పూర్వకంగా తెలిసింది. ఇక్కడి ఖనిజంలో నూటికి 60 వంతులు ఇనుము వున్నదట.

త్వరలో రాష్ట్రప్రభుత్వ గనులశాఖ వివరాలను సేకరిస్తుంది. హైదరాబాదులో ఉక్కు, ఇనుము, పరిశ్రమలు బాగా అభివృద్ధి చేయడానికి అవకాశాలు దీనితో మరింతగా బలపడుతున్నాయని ఒక అధికార ప్రతినిధి చెప్పారు.

## గోదావరి సెంట్రల్ డెల్టా

### రెండవ పంటకు నీరు

కర్నూలు, ఏప్రిల్ 6: గోదావరి సెంట్రలు డెల్టాలో యీనెల 20 వ తేదీ వరకు రెండవ పంటకు నీరు సరఫరా చేయాలని శ్రీ దొల్లకోట నరసింహమూర్తి మంత్రుల దృష్టికి తీసుకువచ్చారు.

మంత్రి గమనించగలరని సభా పతి చెప్పారు.

ప్రశ్నల కాలంలోనే శ్రీ నరసింహమూర్తి యిలా అన్నారు.

15 వ తేదీతో నీటి సరఫరా పూర్తి అవుతుంది. ఈ ఏడు రెండవపంటకు అదనపు విస్తీర్ణం నిర్ణయించి నందున ఫిబ్రవరి ఆఖరువరకు నీరుఅందక నాట్లు జరుగలేదు. 15 వ కాల్వలు కట్టివేసినా అంతకు ముందు కాలువగట్టు కోతల నుంచి నీరు సరఫరా నిలిచిపోతుంది. కనుక కనీసం 20 వరకు నీటి సరఫరా పొడిగించ కోరుతాను."

## రాయలసీమ ప్రజాపరిషత్

కర్నూలు, ఏప్రిల్ 7: ఈ పట్టణ ప్రముఖులు, రాయలసీమ శాసనసభ్యులు, నిన్న శ్రీ మహబూబ్ అలీఖాన్ యింట్లో సమావేశమై, రాయలసీమ ప్రజాపరిషన్మహాసభను, మే నెలమొదటి వారంలో జరపాలని నిర్ణయించారు. శ్రీ ఎస్. నరసింహారెడ్డిని ఆహ్వాన సంఘానికి అధ్యక్షులుగా, శ్రీ ఎం. రామకృష్ణారెడ్డి శ్రీ మహబూబ్ అలీఖాన్ ను ఉపాధ్యక్షులుగా, శ్రీ సి. వెంగళరెడ్డిని కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

మహాసభ అధ్యక్షులుగాను, ప్రారంభకులుగాను, ఎవరెవరిని ఆహ్వానించేది, నిర్ణయించే అధికారం ఆహ్వాన సంఘానికి వదలివేశారు. రాయలసీమ తెలంగాణా ప్రాంతంలోని వారికి కూడా ఆహ్వానాలు పంపాలని నిర్ణయించారు.

నిన్నటి సమావేశానికి శ్రీయుతులు క. వేమారెడ్డి, హెచ్. రామలింగారెడ్డి, బి. రామారెడ్డి, ఎస్. సాంబమూర్తి ఎస్. నారాయణప్ప, రాజారాం, ఎం. క. బి. రెడ్డి, ఎస్. రామలింగయ్య అబ్దుల్ గనిఖాన్ మున్నగువారు హాజరైనారు.

## హిందూపురం వైశ్యవిద్యార్థి వసతిగృహ ఉత్సవం

హిందూపురం, ఏప్రిల్ 8: శ్రీ కంఠయ్యకార్యవైశ్య విద్యార్థి వసతి గృహం అరవ వార్షికోత్సవం మే 8 వ తేదీన డా॥ యం. యస్. దాసన్న అధ్యక్షతన జరిగింది. విద్యార్థుల తరఫున శ్రీ జి. నరసింహయ్య, అధ్యక్షునికి స్వాగతపత్రం సమర్పించారు. విద్యార్థి కార్యదర్శి శ్రీ పి. ఆదినారాయణ వార్షిక నివేదిక చదివారు. ఉన్నతపాఠశాల అధ్యాపకులు శ్రీ క. ఆర్. అచ్యుతరెడ్డి "సాహిత్య అవలోకనం" చేశారు. ఆర్యవైశ్య సంఘాధ్యక్షులు శ్రీ బొంతి భీమయ్య మాట్లాడుతూ ప్రస్తుతం వాసవీధర్మశాల నిర్మాణానికిగాను కృషిచేస్తుండడంవల్ల వసతిగృహానికి స్వంతభవనం నిర్మించడం కొంతకాలం పడుతుందన్నారు. మాజీ పురపాలకసంఘాధ్యక్షుడు శ్రీ కట్టా వెంకటశేషయ్య మునిసిపల్ కమీషనరు శ్రీ జి. మునికృష్ణయ్య శ్రీ క. క. రామలింగయ్య ప్రభృతులు విద్యార్థులు అలవర్చుకోవలసిన మంచి గుణాలను గురించి మాట్లాడారు. అధ్యక్షులు ప్రసంగిస్తూ వసతిగృహానికి సొంత భవనం మూలధనం అత్యంతావసరమన్నారు. శ్రీ పి. మదనగోపాల్ శుభ సందేశాలను చదివారు. ఈ సందర్భంలో జరిగిన పోర్టవజ పోటీలలో గెలుపొందిన వారికి శ్రీ క. యస్. అశ్వత్థనారాయణయ్య బహుమతులను పంచారు. సమాజవికాస కేంద్ర కార్యాలయ రంగస్థలంపై విద్యార్థిబృందం "మన సమాజం" అనే నాటకాన్ని ప్రదర్శించారు. శ్రీయుతులు పి. హనుమంతాచార్యులు, క. ఆర్. అచ్యుతరెడ్డి వర్యకత్వం వహించారు. క్య. వి.

## మంగళగిరిలో అంబర్ చర్ఖా శిక్షణ

మంగళగిరి, ఏప్రిల్ 4: అంబర్ చర్ఖా శిక్షణ కేంద్రాన్ని మరొక సంవత్సరం నిర్వహిస్తారు. మొదటి జట్టుకు ఇచ్చిన శిక్షణ పూర్తి కావటంతో రెండో జట్టుకు మేనెల మొదటి తేదీ నుంచి శిక్షణ ఆరంభం అవుతుంది. ఇందులో 60 మందిని చేర్చుకుంటారు.

ఇతర శిక్షణ కేంద్రాల గడువుకూడా ఒక సంవత్సరానికి పెంచినట్లు తెలుస్తున్నది.

## బడలిక లేని సాహితీ సేవకుడు

### శ్రీ విశ్వనాథ రచనా ప్రశంస

విజయవాడ, ఏప్రిల్ 4: శ్రీ విశ్వనాథ సత్యనారాయణకు షష్టిపూర్తి అయినందుకు వారిని సన్మానించడానికి భరద్వాజ నిలయంలో శ్రీ చివుకుల కృష్ణయ్య సమ్మాన సభ పెట్టారు. సభకు శ్రీ శిష్టా వెంకటకృష్ణయ్య, శ్రీ చింతగింజ నారాయణమూర్తి శ్రీ డి. వి. కృష్ణయ్య శ్రీ ఎం. కోటేశ్వరరావు మొదలైనవారు వచ్చారు. శ్రీ జటావల్లభుల పురుషోత్తము అధ్యక్షత వహించారు. శ్రీ నుప్పావధాని వేదగానం చేసి ఆర్ధం చెప్పారు.

శ్రీ పురుషోత్తం ఇలా ప్రసంగించారు: విశ్వనాథ రచనలు వైవిధ్యం, విస్తారం, విలువ వ్యాప్తి వైదుష్యం నిండియున్నాయి. నవల, ఖండకావ్యం, గేయం, ప్రబంధం, పురాణం, గేయనాటకం మున్నగు సమస్త సారస్వత శాఖలు సత్యనారాయణగారి రచనలలో ఉన్నాయి. విలువలేనికే విస్తార వైవిధ్యాలవలన రచనలు ఆదరణయోగ్యాలు కావు. భాషా పటిమలోను, నుడికారపు బిగువులోను, సుందరంలో నూటిగా నాటికొనే మాటల వాడకంలోను, రసరీతి వృత్తలంకారవ్యంగ్యాది సంపత్తిలోను ఉత్తమశ్రేణికి చెందిన రచనలు సత్యనారాయణగారి లేఖినినుంచి వెలువడినాయి. ఎన్నో లక్షణాలున్నా ప్రజల నోళ్ళలో మెలగే అదృష్టం పట్టని రచనలు లోకంలో చాలా ఉన్నాయి. విశ్వనాథవారి రచనలకు కావ్యాలో పఠనం చేసేవారూ ఉన్నారు. విద్యాధికులే కాకవిద్యావిహీనులు, స్త్రీలు, యువకులు, పెద్దలు—అందరు సత్యనారాయణగారి రచనలను చదవటం చూస్తే యీ యారోపణలో అంత బలం లేదని తెలుస్తుంది. "సత్యనారాయణగారు ఫలాన పుస్తకంలో ఇట్లా వ్రాశారు" అని యెందరో వారి భావాలను ఉదాహరించటం చూస్తున్నాం. మహాకవుల శ్రేణిలో చేరిన ప్రాచీనకవులందరూ ఈరీతిగా ప్రజలనోళ్ళలో మెలగేవారే. సత్యనారాయణగారి రచనలలో కనపడే వైదుష్యం అత్యాశ్చర్యాన్ని కలగ జేస్తుంది. సంగీతశాస్త్రం, నాట్యశాస్త్రం, మానసికశాస్త్రం, వేదాంతం మున్నగు విజ్ఞానశాఖలలో వీరికి గల పాండిత్యం వీరి రచనలలో సర్వత్ర విశదమైయున్నది. సాంఘిక విమర్శల సందర్భంలో వీరు చూపే వాద పటిమ అసాధారణమైనది. సాహిత్యమునగా సంఘ విమర్శనమని మాథ్యూ ఆర్నాల్డు చెప్పినది సత్యనారాయణగారి గద్యరచనలకు చాల భాగం వర్తిస్తుంది. విశేషవ్యాప్తి పొందిన ఆంధ్ర ప్రశస్త్యాది పద్యగ్రంథాల ద్వారా ఆంధ్ర యువకుల మనస్సులపై ప్రస్ఫుటమైన ముద్రను వేయగలిగినారు. నేటివరకు సత్యనారాయణగారు బడలిక నెరుగని, తీరికను కోరని సేవను ఆంధ్ర సాహిత్యానికి చేస్తున్నారు. వీరికి రెండవ షష్టిపూర్తినికూడా ఆంధ్రులు చేయుదురుగాక!"

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, శ్రీ వణుకూరి సుబ్బారావు, శ్రీ కల్లూరి వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులు ప్రసంగించారు. పలువురు పండితులు, ప్రశంసాపద్యాలు చదివారు.

శ్రీ చివుకుల కృష్ణయ్య శ్రీ సత్యనారాయణ దంపతులకు పూజచేసి, నూతన వస్త్రం దంపతులకు తాంబూలాలలో సమర్పించారు. శ్రీ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షంలోని పద్యాలను శ్రావ్యంగా గానంచేశారు.

## అన్నపూర్ణగుడిలో హరిజన ప్రవేశం

### విశ్వేశ్వరాలయంలో ఇంకా నిషేధం

వారణాసి, ఏప్రిల్ 6: అన్నపూర్ణ దేవి ఆలయంలో హరిజనులు ప్రవేశించారు.

'మందిర మర్యాద సమితి' అధ్యక్షులు స్వామి పరమానంద సరస్వతి యింతవరకూ అన్నపూర్ణ అలయంలో హరిజన ప్రవేశం జరక్కుండా ఆటంకం కలిగిస్తున్నారు. ఈ రోజు నుంచి యితర హిందువులతోపాటు హరిజనులకూడా అన్నపూర్ణాదేవి దర్శనం చేసుకోటానికి వీలుంటుంది.

విశ్వనాథ దేవాలయంలో యింకా హరిజన ప్రవేశం జరగలేదు. ఈ రెండు దేవాలయాల్లో కూడా హరిజనులకు ప్రవేశం కలిగించటానికి ఆందోళన జరుగుతున్నది.

## అఖిలభారత కాంగ్రెసు సమావేశం

బొంబాయి, ఏప్రిల్ 7: అఖిలభారత కాంగ్రెసుసంఘ సమావేశం యిక్కడ జూన్ 2, 3, 4, తేదీలలో జరుగుతుందని శ్రీ యస్. క. పాటిల్ నేడు చెప్పారు.

కాంగ్రెసు పార్లమెంటరీపక్షం, కార్యవర్గం, యీ తేదీలను ఆమోదించాయని విశేషాలను తెలిపారు. ఎన్నికల ప్రణాళిక మొదలగు ముఖ్య నిర్ణయాలు యీ సమావేశంలో చేస్తారని తెలిపారు. వేయిమందితో ఒక ఆహ్వానసంఘం ఏర్పాటయినట్లు కూడ ఎల్లుండి సన్నాహాలు ప్రారంభమైనట్లు చెప్పారు.

## భోపాల్ లో మతకలహం

### 40 మందికిగాయాలు

భోపాల్, ఏప్రిల్ 7: నగరంలో ఒకచోట రెండురోజుల క్రిందట ఒక జైన విగ్రహాన్ని ఎవరో అవమానించినందుకు నిరసనగా ఇవాళ షాప్ కమిషను నరసన్నదకు ఊరేగింపొకటి బయలుదేరి వచ్చాక, ఇబ్రహింపురా బజారులో రాళ్లు, సోడాబుడ్లు ప్రయోగంలో మతకలహం ఆరంభమై రాళ్ళు దెబ్బలకు 40 మంది గాయపడ్డారు. పోలీసులు వెంటనే వచ్చి కలహం నివారించడానికి ప్రయత్నించారు. పరిస్థితి మితిమీరినందువల్ల పోలీసులు తుపాకులు కాల్చవలసివచ్చింది.

రాళ్ల దెబ్బలకు గాయపడిన వారిలో అయిదుగురు పోలీసులు కూడా ఉన్నారు. ఒక పోలీసుకు కత్తిపోటు తగిలింది. పోలీసుల జోక్యంతో పరిస్థితిఅదుపులోకి వచ్చింది. అయితే రాత్రి తెల్లవారూ కర్ఫ్యూ అమలు జరిపారు.

నగరంలో ప్రస్తుతం వసతియంటున్న పాకిస్తానీ జాతీయుల దగారా పోలీసులు కనుక్కొంటున్నారు.

### పాకిస్తానీల అరెస్టు

భోపాల్, ఏప్రిల్ 8: నిన్నటి మతకలహం సందర్భంలో ఇవాళ 60 మందిని అరెస్టు చేశారు. వీరిలో ముగ్గురు పాకిస్తానీ జాతీయులున్నారు. హిందూ మహాసభ, జమియత్ ఇస్లామీ సంస్థలకు చెందిన 15 మంది ముఖ్య కార్యకర్తలు అరెస్టయిన వారిలో ఉన్నారు.

పాకిస్తానీయులు ముగ్గురూ తాత్కాలిక అనుమతి పత్రాలలో భోపాల్ వచ్చారు.

నిన్న మత కలహాలను పీరు రెచ్చగొట్టినట్లు అధికారులు అనుమతించారు. కర్ఫ్యూ ఆజ్ఞ ప్రతిఘటించినందుకు 48 గురిని అరెస్టు చేశారు.

నిన్న కలహాలలో గాయపడిన వారిలో ఒక పత్రికా రచయిత కూడా ఉన్నారు.

నగరంలో క్రమేణా శాంతి నెలకొంటోంది.

## కేంద్రపాలితప్రాంతాలలో వైద్య శాఖ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారతీయ వైద్య శాఖ (ఇండియన్ మెడికల్ సర్వీసు)ను పరిమితంగా పునరుద్ధరించే ఆలోచన వున్నది. యుద్ధం, రాష్ట్రీయ పునర్విభజనం, వీటివలన యీ శాఖ నామరూపాలు లేకుండా పోయింది. ఈ శాఖ పూర్తిగా సైన్యానికి సంబంధించింది. శాంతి సమయాలలో సివిల్ ఆస్పత్రులను నిర్వహించేది. కానీ దేశానికి స్వాతంత్ర్యం రాగానే ఎత్తివేసిన శాఖలలో ఇది ఒకటి.

ఈ శాఖ రద్దు కావటంతో సైన్యంలో పని చేసే ఆ వైద్యబృందాలకు మామూలు ఆస్పత్రుల అలవాటు తప్పింది. పైగా సైన్యంలో ఏమీ అంత అవసరంకూడా వుండటంలేదు. దీని మూలంగా అనుభవం తగ్గిపోతోంది. రాష్ట్ర ప్రభుత్వాలు యీ శాఖ పునరుద్ధరించడానికి నిరాకరించాయి.

అందుచేత ఇక కేంద్రప్రభుత్వ పౌర అవసరాలకు, కేంద్రపాలిత ప్రాంతాలలో ఆస్పత్రుల నిర్వహణకు, పరిమితంగా పునరుద్ధరించాలని కేంద్ర ఆరోగ్యశాఖ పురికొల్పుతోంది.

## మద్రాసు శాసన సభ్యుని మృతి

### సభలో ప్రసంగిస్తూ

మదరాసు, ఏప్రిల్ 8: మద్రాసు ఎసెంబ్లీ సభలో ఉపాధ్యాయుల నియోజకవర్గపు ప్రతినిధి శ్రీ ఇ. హెచ్. పరమేశ్వరన్ నిన్న సాయంత్రము పైటాపూరు పి. యస్. హైస్కూలులో ఉపాధ్యాయుల మహాసభలో ప్రసంగిస్తూ హఠాత్తుగా కూలి, ఆసుపత్రిలో మరణించారు. శ్రీ పరమేశ్వరన్ ను అక్కడ పరీక్షించిన డాక్టరు ఆయనను వెంటనే ఆసుపత్రిలో చేర్చమని సలహా యిచ్చినా రాయపేట ఆసుపత్రిలో చేర్చారుగాని ప్రయోజనం లేకపోయింది. ఆయన వయస్సు 57 యేళ్లు.

శ్రీ పరమేశ్వరన్ అంతకుముందు ఎసెంబ్లీసభ సమావేశంలో కూడా పాల్గొన్నారు.

మైలాపూరు పోలీసు స్టేషను సబ్ ఇన్ స్పెక్టరు శ్రీ సి. ఇ. వరదరాజన్ విచారణ జరిపి, శ్రీ పరమేశ్వరన్ హృద్రోగం మూలాన హఠాత్తుగా మరణించినట్లు చెప్పారు.

### ఉపన్యాసం ఇస్తూ వైద్యుని మృతి

డా॥ క. యస్. మాణిక్యమణి (జనరల్ ఆసుపత్రిలో గౌరవ వైద్యుడు), కొత్తలిక్ సెంటర్ లో ఒక సమావేశంలో ఉపన్యసిస్తూ ఇవాళ హఠాత్తుగా మరణించారు.

## చైనాకు రష్యా సహాయం

మాస్కో, ఏప్రిల్ 7: చైనాకు 250 కోట్ల రూబుల్స్ విలువ గల సహాయం చేయడానికి రష్యా అంగీకరించింది. ఒప్పందంపై సంతకాలు జరిగినట్లు టాస్ ప్రకటించింది.

మంత్రాలు, పరికరాలు, సాంకేతిక నిపుణుల సహాయం, రష్యా అందజేస్తుంది.

## గుంటూరులో హైకోర్టు

### న్యాయవాదుల తీర్మానం

గుంటూరు, ఏప్రిల్ 7: ఆంధ్ర-తెలంగాణాలను కలపగా ఏర్పడే రాష్ట్రానికి హైకోర్టును ఇక్కడే వుంచాలని, హైకోర్టు అధికార ప్రాంతాల విషయంలో మార్పులు చేయరాదనీ కోరుతూ పట్టణ న్యాయవాద సంఘం నిన్న తీర్మానించింది. శ్రీ దేశిరాజు హనుమంతరావు అధ్యక్షత వహించారు.

హైకోర్టు విషయంలో హైదరాబాద్ నాయకుల వైఖరిని సమర్థించారు. ఆంధ్ర హైకోర్టును గుంటూరు తగిన స్థానమని న్యాయమూర్తి శ్రీ వాంఛూ చేసిన సిఫార్సును యీ సందర్భంలో పేర్కొన్నారు. నాయకుల వద్దకు రాయబారం పంపడానికి తగు ప్రయత్నాలు జరపడానికి కార్యాచరణ సంఘం ఏర్పరచారు.

సాయంత్రం యల్. బి. ఆర్ అండ్ సన్స్ క్లబ్ లో జరిగిన సభలో కూడా యిలాంటి తీర్మానమే ఆమోదించారు. సభకు శ్రీ పాటిబండ్ల రామమూర్తి అధ్యక్షత వహించారు. కావలసిన స్తే తెలంగాణాకు వేరే శాఖను హైదరాబాద్ లో ఏర్పరచుకో వచ్చని సూచించారు.

హైకోర్టు న్యాయవాదుల అభిప్రాయాలు పరిశీలనలో పలువురు సభ్యులు అన్నారు.

తీర్మాన ప్రతులను రాష్ట్రపతికి, ప్రధానికి, ఆంధ్ర, తెలంగాణా నాయకులకు పంపించారు.

## పశుగ్రాస అభివృద్ధి

### ప్రభుత్వ సంఘ చర్చలు

మదరాసు, ఏప్రిల్ 7: ఆంధ్రరాష్ట్రంలో పశుగ్రాసం, పచ్చికబయళ్ల అభివృద్ధికి సూచనలు చేసే నిమిత్తం నియమించిన స్థాయిసంఘం యీ ప్రథమ సమావేశం యీ వాళ ఆంధ్ర రివెన్యూ బోర్డు కార్యాలయంలో వ్యవసాయ మంత్రి శ్రీ కందుల ఓబులరెడ్డి అధ్యక్షతన జరిగింది.

సమావేశానికి సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ క. యం. ఉన్నితన్, వ్యవసాయ శాఖ డైరెక్టరు శ్రీ ఎ. జే. నాయుడు, అటవీశాఖ కన్సర్వేటరు శ్రీ యస్. డి. సహాని, పశుగణాభివృద్ధిశాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ బషీర్ అహ్మద్ సీరాజీ, శ్రీ యం. యస్. రాఘవన్, శ్రీ పి. శ్రీనివాసరావు, శ్రీ. బి. కోదండరామరెడ్డి, శ్రీ సి. జే. దాసారావు, రివిన్యూ బోర్డు సహాయ కార్యదర్శి శ్రీ డి. దన్ సింగ్ హాజరైనారు.

సమస్యలను అన్నింటిని పరిశీలించి తగు సూచనలు చేయటానికి ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఈ ఉపసంఘానికి పశుగణాభివృద్ధి శాఖ డైరెక్టరు అధ్యక్షుడుగాను అటవిక శాఖవ్యవసాయ శాఖల డైరెక్టరులు, శ్రీ బి. కోదండ రామిరెడ్డి సభ్యులుగాను ఉంటారు. శ్రీ దన్ సింగ్ సమావేశకర్త.

ఉపసంఘం ఆంధ్ర రాష్ట్రంలో పచ్చిక బయళ్లను పశుగ్రాస క్షేత్రాలను దర్శిస్తారు.

రాబోవు సమావేశం ఆగస్టు 7 న జరపాలని నిశ్చయించారు.

## క్రొత్త పంచాయతీలు

కర్నూలు, ఏప్రిల్ 7: రాష్ట్రంలో మరికొన్ని పంచాయతీలను ఏర్పాటు చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

**నెల్లూరు జిల్లా**

ఆముదాలపల్లి, ఉప్పలపాడు, పేలూరు.

**కర్నూలు జిల్లా**

ఎద్దుపెంట, మద్దెపల్లి, ఆలంకొండ, వెంకటాపురం, నార్లపురం, జేవరబండ బొల్లవరం, గోపాలసింగవరం, ఎదురూరు, పెద్దతేకూరు, వేములకోట, కృష్ణాపురం.

**కడప జిల్లా**

రాచపల్లి, పెద్దవీడు, సదమటికోన, సువగట్టివీడు, పాకిబండ, హస్నాపురం ఇట్లూరు, జీవీడు, గాదికోట, వంగిమళ్ల, వీరబల్లి, రెడ్డిపల్లి, ఇటివారపురం వందడి, తిప్పాయపల్లె, గోర్లమూడివీడు, మొరికట్ల, గోవిందపల్లె, పెద్దగొవరలూరు, మాయల్లకాల్వ, తేలూరు, పెద్దచెప్పల్లి, రూప్సరపల్లి, ఈటుకూరు, చెన్నంపల్లె.

**చిత్తూరు జిల్లా**

అదికారిపల్లె, ఎల్లపల్లి, నారిగపల్లె, కోటప్పగారిపల్లె, బంగర్లి, చెన్నంపల్లి నారాయణరెడ్డిపల్లె, కోటమంగాపురం, నడింపల్లి, పెపులబయలు, ఇట్టి వారి పాలెం, అగ్రహారం, బ్రహ్మణ పల్లెపురం, కోడివలస, మాంబేడు.

**గుంటూరుజిల్లా**

శేక్సపాడు, వాకులవలస, జమ్ములమడక, వైదుమంజులూరు, పిచికలగుడిపాడు, మద్దిరాళ్లమువ్వాళ్ళ.

**శ్రీకాకుళం జిల్లా**

కరవంజ, ధర్మపురం, బిములడ, యామలపేట, దండు గోపాలపురం, దేవిడి, పెక్కలిపాడు, ఊగువాడ, కొండి, జనుమల్లవలస, సందబాలగ, నాజర్ల అగ్రహారం, శ్రీ జగన్నాథపురం.

కర్నూలు, ఏప్రిల్ 7: ఆహారం, ఆహారోత్పత్తి, శాఖలను వ్యవసాయ మంత్రి శ్రీ ఓబులరెడ్డికి వొటాయించారు. ఇంతవరకు యివి ముఖ్య మంత్రి అధీనంలో వుండేవి.

## విద్యార్థాయి అభివృద్ధికి ఉపాధ్యాయుల బాధ్యత

### పాఠశాలల వార్షికోత్సవాలలో ప్రముఖుల ప్రసంగాలు

వేమకల్లు, ఏప్రిల్ 8: బోర్డు ఉన్నత పాఠశాల వార్షికోత్సవం యీనెల 1 న శ్రీ యస్. రామచంద్రరావు అధ్యక్షతన జరిగింది. శ్రీ క. యస్. వీరభద్రారెడ్డి పతాకోత్సవం చేశారు. బాలబాలికలకు మిఠాయి పంచారు.

సాయంత్రం సభ జరిగింది. బహుమతులు పంపకం జరిగింది క్రమశిక్షణ, ఉపాధ్యాయుల బాధ్యతలు వివరిస్తూ శ్రీ బి. వి. దొరైరాజు ప్రసంగించారు. వినోద ప్రదర్శనలు జరిగాక శ్రీ క. నరసింహశాస్త్రి వందనసమర్పించారు.

**కంతాడకోటపాడు**

బోర్డు ఉన్నత పాఠశాల వార్షికోత్సవం యీనెల 1 న శ్రీ పి. రామచంద్రరాజు అధ్యక్షతన జరిగింది శ్రీ బి. సత్యనారాయణ స్వాగతమిచ్చారు. శ్రీ ఆర్. ఎ. నరసింహమూర్తి నివేదిక చదివారు.

బహుమతుల ప్రదానం జరిగాక, విద్యార్థులు నాటికలు, బుర్రకథలు ప్రదర్శించారు.

**ఎర్రగుంటపాలెం**

బోర్డు ఉన్నత పాఠశాల వార్షికోత్సవం యీనెల 1 న జరిగింది. శ్రీ యస్. వెంకటేశ్వర్లు అధ్యక్షత వహించారు. శ్రీ యస్. నారాయణ నివేదిక చదివారు. శ్రీయుతులు విజయ్, వైలక్ష్మ్యయ్యనాయుడు, కొన్ని సలహాలిచ్చారు. వినోద ప్రదర్శనలు బహుమతుల ప్రదానం జరిగాయి.

**చీగలమర్రి**

ఉన్నతపాఠశాల వార్షికోత్సవం శ్రీ జె. నారాయణశెట్టి అధ్యక్షతన జరిగింది. శ్రీ నరసింహారావు ప్రారంభం చేశారు. శ్రీ క. రామప్ప నివేదిక సమర్పించారు. విద్యార్థులు వినోద నాటక ప్రదర్శనలు చేశారు. తరువాత బహుమతులు పంచారు.

**అమరాపురం**

బోర్డు ఉన్నతపాఠశాల వార్షికోత్సవం యీనెల 3 న జరిగింది. శ్రీ టి. భీమసేనరావు స్వాగతమిచ్చారు. శ్రీ డి. మార్యనారాయణరావు అధ్యక్షత వహించారు. ప్రధానోపాధ్యాయులు నివేదిక చదివారు. ప్రముఖుల సందేశాలను శ్రీ క. యస్. సుబ్బయ్య చదివారు. శ్రీ యం. యస్. చెన్నారెడ్డి మాట్లాడుతూ పాఠశాల పాలకవర్గం నూతనభవనం నిర్మించుకోవాలని కోరారు. బహుమతులు పంచాక శ్రీ హెచ్. వరసింగరావు, శ్రీ సి. ఆనంద కృష్ణయ్య, శ్రీ జి. రామశాస్త్రి శుభాకాంక్షలు తెలిపారు.

రాత్రి బుర్రకథ నాటక ప్రదర్శనలు జరిగాయి.

**పామిడి**

టి. సి. బోర్డు ఉన్నత పాఠశాల వార్షికోత్సవం మంత్రి శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. శ్రీ అహమద్ మియా నివేదిక చదివారు. శ్రీ క. జగన్నాధరావు సారస్వత నివేదిక సమర్పించారు శ్రీ యం. యస్. చెన్నారెడ్డి, శ్రీ హెచ్. యస్. వి. రమణ శ్రీ దల్లా సుబ్బారాయుడు, శ్రీ పప్పూరి రామాచార్యులు, శ్రీ రాధాకృష్ణ, ప్రసంగిస్తూ వివిధ సమస్యలు సూచించారు. శ్రీ పి. అప్పన్నశాస్త్రి హిందీ ఆవశ్యకత వివరించారు.

బహుమతుల పంపకం నాటక ప్రదర్శనం జరిగాయి.

**ఉయ్యాలవాడ**

మార్చి 30 న హైస్కూలు 10 వ వార్షికోత్సవం జరిగింది. శ్రీ వెంకటయ్య అధ్యక్షత వహించారు. ప్రిన్సిపాల్ నివేదిక సమర్పించారు. విద్యార్థులకు బహుమతి పంపకం జరిగింది. నాటకం ప్రదర్శనం జరిగింది.

శ్రీ యం. యల్. నారాయణ అధ్యక్షతన మదువాడు స్కూలులో స్నాతకోత్సవ సభ జరిగింది. శ్రీ బి. రామకృష్ణ మూడవ సంవత్సరం విద్యార్థులకు వీడ్కోలు చెప్పారు. శ్రీ వై. యం. క. మోహన్ ప్రసంగించారు.

ఈనెల 2 న హైస్కూల్ వార్షికోత్సవం శ్రీ శేషాచారావు అధ్యక్షతన జరిగింది. నాటికలు ప్రదర్శించారు.

**గొల్లవిల్లి**

బోర్డు మాధ్యమిక పాఠశాల వార్షికోత్సవం గతనెల 31 న జరిగింది శ్రీ చాగంటి లింగమూర్తి స్వాగతమిచ్చారు. శ్రీ యస్. రాజప్ప పతాకం ఎగురవేశారు. శ్రీ కొల్లి పద్మనాభశాస్త్రి సారస్వత సభను ప్రారంభించారు. శ్రీ హరివెంకటేశ్వర్లు ప్రసంగించారు.

సాయంత్రం శ్రీ కస్తూరి సత్యనారాయణమూర్తి అధ్యక్షతన సభ జరిగింది. శ్రీ లింగమూర్తి సభను ప్రారంభించారు. శ్రీ ముత్యాల సుబ్బారాయుడు పిల్లలను చదివించాల్సిన బాధ్యతలను వివరించారు. శ్రీ వంపరాల సూర్యనారాయణశాస్త్రి సంస్కృతి ప్రాముఖ్యం వివరించారు. శ్రీ కంభంపాటి రామభద్రరావు లలితకళల ప్రాముఖ్యం తెలిపారు. శ్రీ చాగంటి లింగమూర్తి నివే-

దిక చదివారు. శ్రీ మోటూరి సూర్యనారాయణ రేడియో సెట్టును ప్రారంభించారు. శ్రీ యం. సుబ్బారాయుడు ప్రసంగిస్తూ పాఠశాలకు రేడియో ఆవసరం వివరించారు శ్రీ రామభద్రరావు బహుమతులు పంచారు. శ్రీ భూపతిరాజు వెంకటసత్యమూర్తి వేణుగానం చేశారు. చి॥ సౌ॥ కుమారి ఎ. భారతి, సుబ్బలక్ష్మి, కమల నాట్యంచేశారు. నాటకాలు ప్రదర్శించారు

**పత్తికొండ**

ఉన్నత పాఠశాల వార్షికోత్సవం శ్రీ పి. హనుమంతరెడ్డి అధ్యక్షతన నిన్న జరిగింది.

మంత్రి శ్రీ లచ్చన్న సభను ప్రారంభిస్తూ పాత విధానాలను వదలి, ప్రజలు ప్రభుత్వంపట్ల నూతన దృక్పథం అలవర్చుకోవాలనీ, యిద్దరూ వేరువేర సేవాభావం వుండరాదనీ కోరారు. విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకుండా రాజకీయసిద్ధాంతాలను తూలంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించవచ్చని అన్నారు.

బహుమతుల పంపకంతర్వాత విజ్ఞాన ప్రదర్శనలు జరిగినవి. శ్రీ బి. సంజీవ రాయుడు నివేదిక చదివారు. శ్రీ ఎ. గోపాలకృష్ణరావు వందన సమర్పించారు.

రాత్రి శ్రీ క. బాలకొండప్పమంత్రి గౌరవార్థం విందు చేశారు.

**టంగుటూరు**

ఈనెల 1 వ తేదీన బోర్డు పాఠశాల ద్వితీయ వార్షికోత్సవం జరిగింది. శ్రీ వి. ముత్తు అయ్యర్ (ప్రిన్సిపాల్, సి. యస్. ఆర్. కళాశాల, ఒంగోలు) అధ్యక్షత వహించారు. ప్రధానోపాధ్యాయులు శ్రీ రామారావు పాఠశాల నివేదికను చదివారు. జూలై నాటికి యస్. యస్. యల్. సి తరగతులు ప్రారంభిస్తామని తెలియజేశారు.

తరువాత శ్రీ డి. రామనాధశాస్త్రి 'ఆంధ్ర సాహిత్యంలో వేమన ప్రశస్తి' గురించి ఉపన్యసించారు. శ్రీ రామచంద్రరావు పాఠశాల అభివృద్ధిని ప్రశంసించారు. పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు, బహుమతుల ప్రదానం జరిగింది. విద్యార్థులు వినోద ప్రదర్శనలు చేశారు.

**పాలకొండ**

బోర్డు ఉన్నత పాఠశాల వార్షికోత్సవం, ఈ నెల 2 వ తేదీన జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ ఆర్. వీరభద్రరావు అధ్యక్షతన జరిగింది. ప్రధానోపాధ్యాయులు శ్రీ తాతా విశ్వనాథం పంతులు గారు పాఠశాల గత చరిత్రను సమీక్షించి, ప్రస్తుతం కావలసిన అదనపు సౌకర్యములను వివరించారు. కుమారి శ్యామల, విశాలకుమారి, ఇందిర, రాజామణి, రమణమ్మ, కామేశ్వరి, నృత్య ప్రదర్శనం, బృందగానమూ చేసి, ప్రేక్షకులను మెప్పించారు విద్యార్థులు, హిందీ, తెలుగు నాటికలను ప్రదర్శించారు. శ్రీ మంగిపూడి కృష్ణమూర్తి వందన సమర్పణ చేశారు.

## ప్రత్యేక కారణాలు ఏవీ లేవు

మద్రాసు, ఏప్రిల్ 7: మద్రాసు శాసనసభా కాంగ్రెసుపక్ష సభ్యత్వానికి రాజీనామా ఇవ్వడానికి ప్రత్యేక కారణం ఏమీ లేదని శ్రీ సి. రాజగోపాలాచారి తెలియజేశారు. మద్రాసుఎసెంబ్లీ సభలో శ్రీ రాజాజీ సభ్యత్వం ఏప్రిలు 20 తో ఆఖరవుతుంది. (రాజాజీ నిఎసెంబ్లీ సభ్యులుగా ఇదివరలో గవర్నరు నియమించారు) తిరిగి సభ్యులుగా నియమించాలని గవర్నరు కోరగా తాము ఇష్టపడలేదని రాజాజీ చెప్పారు.

## ఆకాశవాణి

మంగళవారం, ఏప్రిల్ 10

**విజయవాడ**

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగు వా 7-15 మద్రాస్ రిలే 7-30 మద్రాస్ రిలే 8 అంగ్ల వా.

మ॥ 1 ఎ రిలే 1-40 హిందీ వా 1-50 తెలుగు వా 2 రిలే 2-10 హిందీలో కార్యక్రమం.

సా॥ 5-40 టి. క. యశోదా దేవి 5-45 సంగీత శిక్షణ 6 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాంతీయ వా 6-15 గ్రామ కార్యక్రమం 7 తెలుగు వా 7-15 పురాణ కాలక్షేపం 7-40 టి. వి. వెంకటేశన్. టి. కేశవులు-వయొలిన్, క. సింహాచలశాస్త్రి మృదంగం 8-30 గీత మంజరి 8-45 ఫిలిం గీతాలు (రి) 9 అంగ్ల వా 9-15 సాహిత్యసంచిక-ద్వితీయ రివిక 9-30 ఎ. ఐ. ఆర్. వాద్యబృందం 10 ప్రసార సమాప్తి.

**మద్రాసు (ఎ)**

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళ వా 7-30 తంబై వాలు.

మ॥ 12-30 డి. నటరాజన్ 1 మహిళా మండలి 1-30 (రి) 1-40 హిందీ వా 1-50 (రి) 2 తమిళ వా 2-10 నూర్ సుధా-కిశోర్ కృష్ణ (హిందీ ప్రసంగం) బాలచంద్ర అస్టే 2-25 తమిళ ప్రసంగం 2-40 సారంగి 2-50 కాంతిమతి శంకరనారాయణ్.

సా॥ 5-0 పాశ్చాత్యసంగీతం 5-30 టి. టి. వసంత-వీణ 6-05 ప్రాంతీయ వా 6-15 టి. ఎస్. రాజలక్ష్మి 6-45 మాయవరం వేణుగోపాల అయ్యర్ 7-15 తమిళ వా 7-30 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి (రి) 7-45 వి రిలే 9 లలిత గీతావళి 9-15 హిందీ పాఠం 9 30 విజయవాడ రిలే 10 (రి) 10-30 ప్రసార సమాప్తి.

**మద్రాసు (బి)**

ఉ॥ 7 తెలుగు వా 7-15 ఉదయ గానము 7-30 ఎ రిలే 8 అంగ్ల వా.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12 30 ఎ రిలే 1 గీతమాలిక 1-30 అంగ్ల వా 1-40 (రి) 1-50 తెలుగు వా 2 గీత మంజరి 2-10 ఎ రిలే.

సా॥ 5-30 ఎ రిలే 5-50 స్థానిక ప్రకటనలు 6 అంగ్ల వా 6-05 ప్రాంతీయ వా 6-15 గ్రామిణ కార్యక్రమం 7 తెలుగు వా 7-15 పురాణ కాలక్షేపం 7-30 తమిళ ప్రసంగం 7-45 క. ఆర్. గణపతి-వేణువు, తిరుచి బాలసుబ్బరాయలు-వయొలిన్ మద్రాస్ కణ్ణన్-మృదంగం 9 అంగ్ల వా 9-15 తమిళ రూపకం 9-30 తమిళగీతం 10 ఎ రిలే 10-30 ప్రసార సమాప్తి.

**హైదరాబాద్**

ఉ॥ 6-50 సుప్రభాత్ 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా 7-15 హెచ్. ఎస్. గురురాజారావ్ 7-45 కన్నడ వా 8 అంగ్ల వా 8-15 హిందీ వా 8-30 ఖయాల్ 8-45 భజన.

మ॥ 12-30 (రి) 12-50 మరాటీ వా 1 కవాలి 1-10 (రి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాల్ 5-45 ఘజల్ 6 మరాటీలో కార్యక్రమం 6-30 (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ జానపద గీతాలు—ఎస్. జయలక్ష్మి 7 తెలుగు వా 7-15 గ్రామసీమ 7-45 భజన 8 అంగ్ల వా 8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు 8-30 గీతావళి-ఎస్. జయలక్ష్మి 8-30 జ్ఞానా నాయుడు 9 అంగ్ల వా 9-15 ఉర్దూ వా 9-30 అజంతా కా సంజేక్ — ఉర్దూ నాటిక-సలామ్ మచ్ఛీ షెహరీ 10 ఖయాల్ 10-30 ప్రసార సమాప్తి.

## శ్రీకాకుళం జిల్లాలో వ్యవసాయ కేంద్రం

కర్నూలు, ఏప్రిల్ 7: శ్రీకాకుళం జిల్లాలో ఒక వ్యవసాయ ప్రదర్శన, పరిశోధనా కేంద్రం నెలకొల్పాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఇందుకోసం రాగోలులో 80 ఎకరాల భూమి సేకరించడానికి సన్నాహాలు చేస్తున్నారు.

## శివాయి జమాదార్ల భూములు

కర్నూలు, ఏప్రిల్ 7: శివాయి కర్నూలు సాగుచేసుకునే "ఏద శివాయి జమాదార్ల విషయంలో శ్రద్ధ వహించాలని రెవిన్యూ మంత్రికి శ్రీ వేమయ్య, శ్రీ సి. వెంకటయ్య, విన్నవించారు.

హైదరాబాద్ హిందీ శిక్షణ విద్యాలయంలో ఏప్రిల్ 3 వ శిక్షణ పూర్తి అయిననాటి ప్రత్యేక సమావేశంలో విద్యార్థులు, విద్యార్థినులు, అధ్యక్షులు డా॥ చెన్నారెడ్డి, విద్యాశాఖ కార్యదర్శి శ్రీ సేతు మాధవరావు, విద్యాలయ ప్రధానాచార్యులు శ్రీ జగన్మోహన్‌లాల్ చతుర్వేది, హిందీ ప్రచార సంఘ కార్యదర్శి శ్రీ అంజనేయశర్మ.

విజయవాడలో ఈ మధ్యనే ప్రతిష్ఠితులైన శ్రీ నటరాజస్వామి రథోత్సవం.

విజయవాడ దగ్గర కృష్ణానదిపై నిర్మించుతున్న రోడ్డు బ్రిడ్జి కాంట్రాక్టరు పని చురకుగా సాగుతున్నది. ఇంతవరకు సీతానగరం వైపునుంచి పని సాగుతున్నది. 20 దిమ్మల నిర్మాణం జరిగింది. వీటిమీద రోడ్డు వేయడం కూడా పూర్తి అయింది. (మొదటి చిత్రం) ఈయేడు దీనికి తోడుగా, విజయవాడ వైపునుంచి పని ప్రారంభించారు. దిమ్మల నిర్మాణం చురకుగా సాగుతున్నది (రెండవ చిత్రం).

# స్పానిష్ మొరాకో స్వాతంత్ర్యం

## ఫ్రాంకోకు సుల్తాన్ కృతజ్ఞత

మాడ్రిడ్, ఏప్రిల్ 7: స్పానిష్ మొరాకో స్వాతంత్ర్యాన్ని, మొరాకో ఐక్యతనూ గుర్తించేందుకు స్పెయిన్ ప్రభుత్వానికి మొరాకో సుల్తాన్ సిది మహమ్మద్ కృతజ్ఞత ప్రకటించారు.

స్పానిష్ మొరాకో స్వాతంత్ర్యం గుర్తించిన ఒడంబడికపై మొరాకో ప్రధాని, స్పెయిన్ ప్రధాని సంతకాలు పెట్టారు.

ఈ సందర్భంలో రాయబారాలు ధరించిన తరవాత సుల్తాన్ ఇవాళ మాడ్రిడ్‌లో బయలుదేరి గ్రెనడా చేరుకొని విమానాశ్రయంలో పత్రికా ప్రతినిధులకు తమ కృతజ్ఞత ప్రకటించారు.

విమానాశ్రయంలో సుల్తాన్‌కు స్పెయిన్ నియంత జనరల్ ఫ్రాంకో, అరబ్ దేశాల రాయబారాలు వీడ్కోలు ఇచ్చారు.

# వేశ్యావృత్తి నిర్మూలన

## శ్రీ పంత్ బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 7: వేశ్యావృత్తిని నిర్మూలించడానికి సమాజంలో నైతిక సైతన్యాన్ని వ్యాపింపచెయ్యడం అవసరం అని దేశీయాంగమంత్రి శ్రీ గోవిందవల్లభపంత్ స్త్రీ జనసంరక్షణ సమితి ప్రథమ సమావేశం ప్రారంభిస్తూ బోధించారు. ఈ ప్రచార కార్యక్రమంలో స్త్రీలే ముందడుగు వెయ్యాలన్నారు.

అవినీతి నిర్మూలనకు ఒక శాసనం ప్రస్తుతం పార్లమెంటులో ఉంది.

పతితలైన స్త్రీలను ద్వేషించరాదని, సానుభూతితో దయతో వారిని అవినీతి నుంచి మరల్చాలని శ్రీ పంత్ చెప్పారు. వీరిలో సాంసారిక జీవనం చెయ్యాలని కోరేవారిని సంస్కారవంతులైన యువకులు ధైర్యంచేసి వివాహం చేసుకోడానికి సిద్ధపడాలన్నారు. అవినీతినుంచి స్త్రీ పురుషులను వారించడానికి స్వచ్ఛందసేవకులు ప్రచారం చెయ్యడం అవసరం అన్నారు.

# శ్రీ గోపాలరెడ్డి కార్యక్రమం

కర్నూలు, ఏప్రిల్ 7: విశాఖ జిల్లాలో ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి యీ నెల 14 నుంచి 28 వరకు పర్యటిస్తారు.

వాల్తేరులో 14 న చేరుకుంటారు. అక్కడినుంచి మాచ్‌ఖండ్ వెళ్లి విద్యుత్ సంస్థ సమావేశంలో పాల్గొంటారు. 17 న అరకు, జయపూర్ వెళ్తారు. 18 న కోరాపుట్, సాలూరు, బొబ్బిలి చూస్తారు. పంచదార ఫ్యాక్టరీని తనిఖీచేసి చెరకు రైతుల సభలో పాల్గొంటారు. పార్వతీపురంలో ఆ రాత్రి ఆగి 19 న ఉత్తరవిల్లి, రాజాం, చీపురుపల్లి చూసుకొని రాత్రికి విశాఖ చేరుకుంటారు. 20 న ప్రదేశ్ కాంగ్రెసు సమావేశంలో పాల్గొంటారు. 21 న నర్సీపట్నంలో రోడ్డుకు ప్రారంభం చేస్తారు. ఇరవన్ని పేట మీదుగా రాత్రికి 7కి వెళ్తారు. 22 న చోడవరం, తుని, ఇచ్ఛాపురం, యలమంచిలి మొదలుగా ప్రాంతాలలో పర్యటిస్తారు.

# వెనుకబడిన జాతుల తరగతుల మహాసభ

కర్నూలు, ఏప్రిల్ 8: ఆంధ్ర రాష్ట్ర వెనుకబడిన తరగతుల జాతుల, విద్యార్థుల మహాసభ యీ నెలాఖరున జరిగే అవకాశం కలదని కేంద్ర మంత్రి శ్రీ రాజేంద్ర ప్రారంభిస్తారని శ్రీ ఎ. భగవంతరావు ప్రకటిస్తున్నారు. ఆహ్వాన సంఘం ఏర్పాటుకు కర్నూలులోని దక్షిణాది బంగళాలో ఈ నెల 11 న సమావేశం జరుగుతుందని తెలియజేస్తున్నారు.

Printed and Published for Nageswara Rao Estates (private) Ltd. by S. Radha Krishna, at the Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St. Madras-1. Editor S. Sambhu Prasad.

# మద్రాసు రాష్ట్రంలో ఉక్కు ఫ్యాక్టరీకి అవకాశం

## అల్యూమినియం ఉత్పత్తి సంకల్పం

సేలం, ఏప్రిల్ 7: మద్రాసు రాష్ట్రంలో ఉక్కు కర్మాగారం స్థాపించే విషయం కేంద్ర ప్రభుత్వం తప్పక ఆలోచిస్తుందని కేంద్ర ఉత్పత్తి శాఖామంత్రి శ్రీ కె. సి. రెడ్డి డాక్టర్ రాష్ట్రాలకు వాగ్దానం ఇచ్చారు.

నైవేలిలో లిగ్నైట్ గనులు చూడడానికి వచ్చిన శ్రీ రెడ్డి, లిగ్నైట్ గనుల కార్యక్రమం ఫలవంతమైనట్లయితే ఉక్కు కర్మాగారం స్థాపించడానికి వీలౌతుందని చెప్పారు. కేంద్రప్రభుత్వం ఇక్కడ ఉక్కు కర్మాగారం స్థాపించడానికి సంకోచిస్తున్న కారణం ఏమిటంటే, సమీపంలో బొగ్గు దొరకదు; ఉత్తరాదినుంచి అపారంగా దిగుమతి చేసుకోవలసి వస్తుంది. లిగ్నైట్ గనులను విద్యుదుత్పత్తికే కాక, ఇతర పరిశ్రమల వృద్ధికి కూడా వినియోగపడాలన్నారు.

ఇక్కడి సమీపంలోని కంజమలై గనుల్లో ముడిఇనుము మూటికి 40 శాతం లభ్యమౌతుందన్న మాట నిజమే. అయితే ఇంగ్లండు, జర్మనీలలో ఇంతకంటె నాసి గనుల్లో ఇనుము ఉత్పత్తి చేస్తున్నారు. అందువల్ల లిగ్నైట్ గనుల ప్రయోజనం తేలిపోగానే ఉక్కు కర్మాగారం నెలకొల్పి తీరతారని శ్రీ రెడ్డి చెప్పారు. ఉక్కు కర్మాగారం విషయంలో మద్రాసు ప్రభుత్వం చాల పట్టుబట్టి ఉన్నదని చెప్పారు.

చేతివృత్తులవారు ఆధునిక పరికరాలను అధికంగా వినియోగించడం వల్ల ఉత్పత్తి పెంచాలని శ్రీ రెడ్డి సలహా ఇచ్చారు. ఇటువంటి చిన్న పరిశ్రమలను కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రోత్సాహపరుస్తాయని చెప్పారు.

ఇక్కడి వ్యాపారుల సభలో ప్రసంగిస్తూ, పారిశ్రామికులు సలహా అల్యూమినియం ఉత్పత్తిచేసే కర్మాగారాన్ని సేలంవద్ద స్థాపించే విషయాన్ని కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నదని శ్రీ రెడ్డి చెప్పారు. ఈ పరిశ్రమకు శేవరాయ్ కొండల్లోని బాక్సైట్ ను వినియోగిస్తున్నారు. బాక్సైట్ ఇంకో విధిగా లభ్యమై, విద్యుచ్ఛక్తిని మద్రాసు ప్రభుత్వం ఇంకా చౌకగా ఇచ్చేపక్షంలో అల్యూమినియం ఉత్పత్తిని 22 వేలకు పెంచే అవకాశంకూడా ఉంటుందన్నారు.

సేలంలో మరొక్కచోట కూడా బాక్సైట్ నిరివిగా లభ్యమై, విద్యుచ్ఛక్తి చౌకగా లభించినట్లయితే, అక్కడ అల్యూమినియం పరిశ్రమలను స్థాపిస్తారని శ్రీ రెడ్డి చెప్పారు.

శ్రీ రెడ్డి బెంగుళూరునుంచి రైలులో సేలం వచ్చి, ఇక్కడనుంచి విమానం ద్వారా కోయంబత్తూరు వెళ్లారు.

# ప్రభుత్వంపైనే ఆధారపడరాదు

## వేటపాలెంలో శ్రీ ఓబులరెడ్డి హితవు

వేటపాలెం, ఏప్రిల్ 2: రాష్ట్ర వ్యవసాయశాఖామంత్రి శ్రీ ఓబులరెడ్డి గత నెల 30 న యీ గ్రామం వచ్చారు. పట్టణకాంగ్రెసు సభ్యులు స్వాగత మిచ్చారు.

పట్టణకాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ పృథ్వి సూర్యనారాయణను శ్రీ ప్రగడ కోటయ్య పరిచయం చేశారు. మధ్య నిషేధ సమస్యపై కార్యకర్తల కృషికి శ్రీ ఓబులరెడ్డి హర్షం వెలిబుచ్చారు.

పంచాయతీబోర్డు ఆవరణలో సన్మాన సభ జరిగింది. శ్రీ ప్రగడ కోటయ్య అధ్యక్షత వహించారు. సభ్యులు సన్మాన పత్రం సమర్పించారు.

సొసైటీ క్రింద పండించుకునే మాగాణి భూములకు నీటితీరువ బకాయిలు రద్దు చేయాలనీ, జీడిమామిడి చెట్ల పెంపకానికి తగు సౌకర్యాలు కలుగజేయాలనీ, యిక్కడినుంచి సముద్రంవరకు రోడ్డు ఒకటి నిర్మించి మత్స్యపరిశ్రమాభివృద్ధికి దోహదమివ్వాలనీ, పశువైద్యశాల, మాతాశిశుకేంద్రం నెలకొల్పాలనీ అందులో కోరారు.

మంత్రి సమాధానమిస్తూ ప్రగతి ప్రతిదానికీ ప్రభుత్వంపై ఆధారపడరాదని, నూతనశిశుకేంద్రం వంటివాటి స్థాపనకు ప్రజలే ప్రూనుకోవాలని కోరారు. జాలరులకు కొత్తరకం వలలు యిచ్చి మత్స్యపరిశ్రమాభివృద్ధికి కృషి చేస్తామని చెప్పారు, విద్యుచ్ఛక్తి యికమీదట పుష్కలంగా లభించగలదన్నారు.

ఉన్నత పాఠశాలలో జరిగిన సభలో ఆడిటింగ్ పాలెం పండిట్ పల్లి, గ్రామాలవారు సన్మానపత్రాలు సమర్పించారు. శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావుపంతులు, శ్రీ ప్రగడ కోటయ్య, శ్రీ పృథ్వి సూర్యనారాయణ, శ్రీ పసుపులేటి నారాయణ ప్రసంగించారు.

# జమ్మూ పురపాలకసంఘ ఎన్నికలు

జమ్మూ, ఏప్రిల్ 7: పురపాలక సంఘ ఎన్నికలో ఏడుగురు జాతీయపరిషత్తు అభ్యర్థులు, ఆరుగురు ప్రజాపరిషత్తు అభ్యర్థులు గెలిచారు. ఆరుగురు స్వతంత్రులు ఓడిపోయారు. [illegible] జాతీయ పరిషత్తుకు పోటీ లేకుండానే గెలుచుకున్నది. ప్రజాపరిషత్తు ప్రధాన కార్యదర్శి ఓంప్రకాశ్ ఓడిపోయారు.

# పిట్టాడలో ఒకస్త్రీ మరణం

## 400 ఇళ్లు దగ్ధం

విజయనగరం, ఏప్రిల్ 8: గతనెల 31 ఉదయం పిట్టాడ గ్రామంలో అతి ఘోరమైన అగ్ని ప్రమాదం సంభవించింది. ఒక స్త్రీ ఒళ్ళుకాలి మరణించింది. 3 పశువులు కూడా కాలిపోయాయి. 400 ఇండ్లు దగ్ధమైనవి. ఆస్తినష్టం సుమారు రు 2 లక్షలని తెలుస్తోంది.

## కనిమెరకలో అగ్నిప్రమాదం

విజయనగరం, ఏప్రిల్ 8: కనిమెరక గ్రామం హరిజనవాడలో నిన్నరాత్రి అగ్ని ప్రమాదం సంభవించింది. 8 పూరిళ్ళు, పెంకుటిళ్ళు, కాలిపోయాయి. సుమారు రు 8 వేల ఆస్తి నష్టమైంది.

# ఇస్రేల్‌తో పోరాటంలో ఈజిప్టుకు సిరియా అండ

డమాస్కస్, ఏప్రిల్ 7: ఇస్రేల్‌పై పోరాటంలో ఈజిప్టియన్లకు సిరియా అరబ్‌లు అండగా నిలవగలరని సిరియా అధ్యక్షుడు ఖువత్లీ కొటేస్తూ ఈజిప్టు ప్రధానికి పంపిన కేబుల్ వార్తలో తెలిపారు.

సిరియన్ ప్రజా ప్రతినిధులు నేడు ఇస్రేల్ దురాక్రమణ చర్యలను ఖండిస్తూ ప్రసంగాలు చేశారు.

## గాజావద్ద పోరాటం

జెరూసలెం, ఏప్రిల్ 7: ఈజిప్షియన్ సైన్యాలు గాజాకు తూర్పున నేటిరాత్రి పెద్దపెట్టున దాడులు ప్రారంభించాయని ఇస్రేల్ సైనిక ప్రతినిధి చెప్పారు. రోడ్లమీద రాకపోకలకు ఆటంకం కలిగిందనీ, నీటి సరఫరా మార్గాలు దెబ్బతిన్నాయని తెలిపారు. ఒకరు చనిపోయారు. చాలామంది గాయపడ్డారు.

కనిగిరి, ఏప్రిల్ 8:— తాలూకా గ్రామోద్యోగ సంఘం అధ్యక్షుడు రాజీనామా యిచ్చినందువల్ల, ఉపాధ్యక్షులైన శ్రీ రామచంద్రుని అధినారాయణను తాత్కాలికంగా అధ్యక్షపదవి యిస్తూ సంఘం తీర్మానించారు.

# వ్యాపారపు పన్నులను కేంద్రమే వసూలుచేయాలి

## బెజవాడ వాణిజ్య పారిశ్రామిక మండలి తీర్మానాలు

విజయవాడ, ఏప్రిలు 7: వాణిజ్య పారిశ్రామిక మండలి సర్వసభ్య సమావేశం శ్రీ బచ్చు వెంకటేశ్వర్లు అధ్యక్షతన ఏప్రిలు 3 న సమావేశమై అన్నిరకాల వ్యాపారపు పన్నులనూ కేంద్రమే వసూలు చేయాలని, అప్పుడు పరిపాలనా ఖర్చులు కూడా తగ్గుతాయనీ తీర్మానించారు.

ఈ క్రింది తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించారు.

ప్రతి వ్యాపారస్థునీ రిజిష్టరు చేయాలి. రిజిష్టరు అయిన వ్యాపారస్థులు మాత్రమే కొనుగోళ్లు అమ్మకాలు జరుపుకొనే హక్కు కలిగి ఉండాలి.

పన్ను పడవలసిన వ్యాపార మొత్తపు కనిష్ఠ పరిమితిని తొలిగించాలి. కొనుగోలు లేక అమ్మకపు పన్ను, పన్ను, ఒకచోట మాత్రమే (సింగిల్ పాయింటు టాక్సు) విధించాలి. రైతు వ్యవసాయోత్పత్తుల స్వరూపం మార్చి విక్రయిస్తున్నప్పుడు కొనుగోలు పన్నును అతనుకూడా వ్యాపారస్థుల లాగానే చెల్లించే ఏర్పాటు ఉండాలి. (వడ్లను బియ్యంగా మార్చినప్పుడు, వేరుశెనగకాయను పప్పుగాను, పప్పును నూనెగాను మార్చినప్పుడు, గోధుమలను పిండిగా మార్చినపుడు) రైతులు ఇతర రాష్ట్రాలకు తమ సరుకులను పంపేటపుడు, కొనుగోలు పన్నును వారు కూడా ఇతర వ్యాపారస్థులవలెనే చెల్లించే ఏర్పాటు ఉండాలి. ఇతర రాష్ట్రాలనుంచి దిగుమతి అయ్యే సరుకులమీద మొదటి దిగుమతిదారుడే కొనుగోలు పన్ను చెల్లించాలి. అమ్మకపు పన్ను అధికారులకు అదనపు అధికారాలను ఇవ్వవలసిన పనిలేదు. అట్లా ఇస్తే లంచగొండి తనం హెచ్చు పెరగటమే గాక, పన్ను ఎగవేతకు కూడా దోహదకారి అవుతుంది.

కొబ్బరిబోండాలలోని నీరు, వేసవిలో బాటసారులకు చల్లదనం ఇచ్చి, దాహాన్ని తగ్గించే పానీయంగామాత్రమే ఉపయోగపడుతున్నది. దీనిపై అమ్మకపు పన్ను విధించటం అన్యాయం. వీటిని కూడా పళ్ళు, కూరగాయల జాబితాలో జేర్చి, వీటిపై విధించుతున్న అమ్మకపు పన్నును రద్దుచేయాలి.

నస్యం, చుట్టలు తయారు చేసే పరిశ్రమ మన రాష్ట్రంలో బాల్యదశలోనే ఉన్నది. ఎక్సైజు పన్నుతోనే సతమతమవుతున్న ఈ పరిశ్రమపై రాష్ట్ర ప్రభుత్వం, తయారుచోటనే రూపాయికి ఆరు పైసల చొప్పున, టర్నోవరు మీద నూతనంగా అమ్మకపు పన్ను విధిస్తున్నారు. వేలమంది కార్మికులకు జీవనోపాధి కలిగించుతున్న ఈ పరిశ్రమ గృహపరిశ్రమగానే అభివృద్ధి చెందుతున్నది. ఇతరరాష్ట్రాలనుంచి దిగుమతి అయ్యే సరుకులతో మనరాష్ట్రంలో తయారవుతున్న ఈ సరుకులు పన్నుల భారం చేతనూ, కార్మికులకు ఇచ్చే అధిక వేతనాల మూలంగానూ పోటీచేయలేకున్నది. పైన ఉదహరించిన పరిస్థితుల నన్నింటినీ గమనించి, నూతనంగా విధించిన అమ్మకపు పన్నును రద్దు చేయాలి.

వ్యాపారసంబంధమైన అన్ని రకాల పన్నులను కేంద్రప్రభుత్వమే తన అజమాయిషీలోనికి తీసుకుని, ఆయా రాష్ట్రాలకు ప్రతిఫలం ముట్టచెప్పతే వ్యాపారం జరుగుబాటు సులువుకావడమే గాక రాష్ట్రప్రభుత్వాలకు తత్సంబంధమైన నిర్వహణ ఖర్చులు కలిసివస్తాయి కాబట్టి కేంద్ర ప్రభుత్వం ఈవిషయమై ఆలోచించడం అవసరం.

భోజన, కాఫీ విక్రయశాలలో జరుగు అమ్మకాలలో మూడవ వంతు నిర్వహణ ఖర్చులు కలిసివుంటాయి. అమ్మకపు మొత్తంలో మూడవవంతు నిర్వహణ ఖర్చులక్రింద మినహాయించి, మిగతా మొత్తంపై మాత్రమే, హెచ్చు తగ్గులులేని ఒకటేవిధమైన అమ్మకపుపన్ను విధించటం బాగుంటుంది.

ఈ సూచనలను అమ్మకపు పన్ను విచారణ సంఘానికి నివేదిస్తారు.

# కురుపాండవ తటాకం

## రైతులకు సంగమ క్షేత్రం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 7: భారత్ సేవక్ సమాజ్ అభివృద్ధి కేంద్రానికి చెందిన రైతులు కురుక్షేత్రంలో సుమారు 700 మంది రైతులకు విందు చేశారు. వీరిలో భారతదేశం అన్ని ప్రాంతాల నుంచి వచ్చినవారున్నారు.

పాండవులు, కౌరవులు కలుసుకొనే స్థలంగా ఉండే కోనేటిలో "సన్నిహితి" అనే తటాకం సంగమ స్థలంగా ఉండేదట. ఇప్పుడు యీ రైతులంతా పవిత్రమయిన యీ చెరువుగట్టున సమావేశమై ఉత్సవం చేసుకున్నారు.

హెచ్.ఆర్. & సి ఇ. (పాలక) శాఖ, ఆంధ్ర ఆఫీసు, గుంటూరు.

నోటీసు మెమో నెం. 17060/55 6 JDI. 2-4-56.

విషయము - మద్రాసు హెచ్. ఆర్ & సి. ఇ. చట్టము 1951 యొక్క 85 (1) సెక్షన్ వరకుల క్రింద నోటీసు.

పాన్నూరు గ్రామములోఉండి, క్రింది షెడ్యూల్‌లో మరింత వివరించిన S No 46 లోని ఎ 2.80 సెంట్లు ఈనాం మాగాణిభూమి బహిరంగ వేలములో విక్రయించుటకు మంజూరుకోరుతూ గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా, నిడుబ్రోలు గ్రామములోని శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయము ధర్మకర్తలు దరఖాస్తుచేసి ఉన్నందున, యిందుకు సంబంధించినవారెవరు గాని ఎట్టి ఆక్షేపణలు, లేదా సూచనలు చేయదలిస్తే, వ్రాతమూలకంగా కమీషనర్ హెచ్. ఆర్. & సి. ఇ; ఆంధ్ర, ఆఫీసు, గుంటూరుకు 8-5-56 తేదీ నాటికి, లేదా ఆలోగా చేరేటట్లు పంపవలెను.

భూముల షెడ్యూల్

| ఎస్. నెం. | పట్టా నెం. | విస్తీర్ణం. | అస్సెస్మెంట్. |
| --- | --- | --- | --- |
| 46 | 586 | ఎ. 2.82 మాగాణి | రు. 6-18-0 |

హద్దులు

తూర్పు: పాములపాటి లో కొడిత్య దత్తపుత్రుడు శివరామకృష్ణప్రసాద్ ఇల్లు; దక్షిణం. పాములపాటి లో కొడిత్య దత్తపుత్రుడు శివరామకృష్ణప్రసాద్, మరియు తలశిల వీరయ్యకుమార్తు పెద బసవయ్య, చిన బసవయ్య, రామారావు, రేపల్లె రామస్వామి కుమారుడు సుబ్బయ్యఇల్లు; పశ్చిమం: కోన లక్ష్మీకాంతరావు, కొండమూరి శ్రీమన్నారాయణమూర్తి, కొండమూరి వెంకటేశ్వరరావు, బొడ్డులూరి బసవయ్య, గొర్లపాటి రంగమ్మగార్ల ఇళ్లు; ఉత్తరం: నిడుబ్రోలు పంచాయితీ బజార్.

ఆర్. వెంకటరెడ్డి, కమీషనర్.